దైవ, ధర్మకార్యాలు ఆచరించడానికి వాయిదాలు వేయకండి'

# సుఖస్యమూలం ధర్మః

## సుఖపడడానికి ధర్మమే మూలము.

# ధర్మో రక్షతి రక్షితః

## తనను రక్షించువారిని ధర్మం రక్షిస్తుంది.

## పిబత భాగవతం రసమాలయం

భాగవతామృతాన్ని జీవితాంతం పానం చేయండి

18 లక్షల రూపాయల వ్యయంతో, వృద్ధులు సయితం సునాయాసంగా చదువుకోవడానికి వీలైన పెద్ద టైపులో ఆఫ్ సెట్ ముద్రణలో, బహువర్ణ ముఖచిత్రంతో విడుదల కావలసియున్న

# శ్రీ కృష్ణలీలామృతము

18 వేల ప్రతుల ప్రచురణ విశేష ప్రచారాలకు సకాలంలో భూరివిరాళాలను అందజేసి విశ్వవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తికులకు అందజేసే మహోద్యమంలో చేయూత నీయండి. మీ మార్గం సర్వులకూ ఆదర్శమగును గాక!


వివరాలకు ఫోన్ : 76356 : STD:0883.

పురాణపండ రాధాకృష్ణమూర్తి

జయశ్రీ టాకీస్ రోడ్ - రాజమండ్రి - 4. (ఆం.ప్ర - ఇండియా)

# శ్రీ త్రిపురసుందరీ
# మానసపూజాస్తోత్రమ్

ఓం - ఐం - హ్రీం - శ్రీం

ఆది శంకరాచార్య

ప్రణీతమైన శ్లోకాలకు

భావార్థ మాత్రము

ఐం - క్లీం - సౌః

ప్రకాశకుడు, ప్రచారకుడు :

పురాణపండ రాధాకృష్ణమూర్తి

జయశ్రీటాకీస్ రోడ్ - సూర్యాహోటల్ దగ్గర

రాజమండ్రి - 4

# శ్రీ త్రిపురాసుందరీ
# మానసపూజాస్తోత్రమ్



ప్రథమ ప్రచురణ
3-7-1993
వ్యాసపూర్ణిమ



రూ. 5-00



ముద్రణానిర్వహణ
భరద్వాజా బైండింగ్ వర్క్స్
రాజమండ్రి - 4



ఫోన్ నెంబర్ :
76356

ప్రతులకు, వివరాలకు
పురాణపండ రాధాకృష్ణమూర్తి
రాజమండ్రి - 4

' అమ్మదయ ఉంటే అన్నీ ఉన్నట్లే '

# శ్రీ త్రిపురసుందరీ మానసపూజాస్తోత్రమ్

ఓం-ఐం-హ్రీం-శ్రీం-శ్రీమాత్రే నమః

## భావార్థం

1. మాతా! ఆదిశక్తీ! నిన్ను సేవించే సామర్థ్యం నాకు లేదు. నీ చరణకమలాల యందు భక్తీ లేదు. పోనీ విషయాలయందు వైముఖ్యమూ లేదు. అలా అని ధ్యాన విషయంలో ఆసక్తి ఉన్నదా అంటే అదీ లేదు. వీటన్నిటినీ మనసా యోచిస్తూ రుచిరమైన వచనాలతోనే నిన్ను అర్చిస్తూన్నాను.
2. సువర్ణ జలజంతువులతో నిండినదీ దేవ సంఘాలు ఎక్కియున్న చిన్నచిన్న పడవలతో కలవరపడుతున్న మధ్యభాగం కలదీ, మణిమయ గిరులచే అలంకృతమైనదీ, ఉత్తుంగ తరంగ పంక్తులచే వ్యాకులమైన ఆకాశం కలదీ ఈషదరుణారుణ మైన సాగరాన్ని ఓ చిత్తమా! పదేపదే చింతించి సార్థకమైన దానవు కమ్మ.
3. అయ్యమృత సముద్రంలో భాసిల్లే రత్న జాలాలనుండి రేగిన కిరణాలతో అంబర వీధిని ప్రకాశింప జేయుచు, సర్వేసర్వత్రా ఇంద్రధనుస్సులతో ఆచ్ఛాదితమవుతూ, మహోన్నత గిరిశిఖరాలపై ఆసీనలైన దివ్యనారీ సమూహాల

వదనాల నుండి బహిర్గత మవుతున్న గీతాలను ఆలకిస్తూ చలించకుండ ఉండునట్టి హరిణ సమూహాలతో కూడిన - మణి ద్వీపానికి ప్రణమిల్లు తూన్నాను.

4. ఆ మణి ద్వీపాన నయనానంద ప్రదమైన నందనవనం ఉంది. ఆ సుందరోద్యాన వనంలో జాజీ, సంపెంగ, గులాబీల పూలవాసనలు వ్యాపిస్తుంటాయి. 'హ్రీం'కార నాదాలు గళసీమలో కల కోకిలల కుహూ కుహూ నాదాలతో మామిడిచెట్లు వికసిస్తూ ఉంటాయి. సుగంధ భరిత చందన వనాలతో, చంచలంగా చరించే భ్రమరసముదాయంతో, అత్యంత సుందరంగా వున్న ఆ వనాన్ని ఓ మానసమా! చిరకాలం స్మరించుము.

5. పుష్పపరాగం రాలగా ఎర్రవారిన అక్కడి పృథ్వీ భాగం కలదీ వికసిత కుసుమ సమూహాలచే త్రాగ బడుతున్న రవిచంద్ర కిరణాలు కలదీ భ్రమర నాదాలతో, శుకపిక సంతతుల మధుర నాదాలతో, కర్ణేంద్రియాన్ని విశేషంగా ఆకర్షించునట్టి ఆ దివ్యోద్యానరాజము నా హృదయ మందిరంలో సర్వదా భాసిల్లును గాక!

6. మనోహర ద్వారాలతో, పురవ్యాప్తాంధకారాన్ని రూపుమాపు నట్టి కాంతులతో, పురద్వారావకాశమందలి వజ్రాంకురవ్యాప్త హారకాంతులతో, పృథ్వీమండలానికి హేమహారమై, నిరంతరం వర్ధిల్లు నట్టీ - భవసాగరానికి గల ఆవలి తీరాన్ని చేర్చునట్టి ఓ సువర్ణ ప్రాకారమా! భక్తజనుల మనస్సులలో

విహరించుదానా! నీకు ప్రణామాలు.

7. అయ్యుద్యాన వనం లోని సువర్ణ ప్రాకార మధ్యభాగాన మణిమయ మండపం, ఉదయ కాంతి పుంజములచే యావదాకాశానికే తగినంత వితాన సంపదను కల్పించుచు, కృష్ణాగురు ధూపసుగంధంతో యావదాకాశాన్ని సువాసితం చేసి వ్యాప్తమవుతూ, నిత్యం దేవగణ సంసేవితమవుతూ వుంటుంది. అట్టి లక్ష్మీ ప్రదమైన మణిమండపం సర్వదా నా చిత్తాన్ని తేజరిల్ల జేయుచుండును గాక!

8. జననీ! నీ మణిమందిరం ఒకచోట పద్మరాగ మణికిరణ గణప్రభలతోను, వేరొకచోట విశేషప్రకాశం గల మరకత కాంతులతోనూ చీకటి వలె చేయుచు, మరో చోట వ్రేలాడునట్టి ముత్యాల హారాలతో ద్విగుణీకృత కాంతులతో వెన్నెలలా చేస్తూ సుందరంగా ఉంటుంది. మాతా! అట్టి నీ మణి మందిరానికి ప్రణామం చేస్తున్నాను.

9. రవి రథాశ్వాలు యిక్కడి మహోన్నత భవనాలలో ప్రకాశించే మరకత మణికాంతులను తిలకించి - లే పచ్చిక భ్రాంతితో రథాన్ని దారితప్పించి పైకి లాగుతుండగా సారథి అయిన అనూరుడు కళ్ళెమును గట్టిగా పట్టుకుని అతి కష్టం మీద వాటి తలలను ఋజుమార్గంలోకి త్రిప్పి రథాన్ని దారిలో పెడుతూ వుంటాడు.

10. మణిమయ మండపం నుండి బహిర్గతమయ్యే కాంతిపుంజంచే అంబరం ఎర్రవారగా రవిరథాశ్వాలు సాయం సమయమైనదని దిగబడు నడకలతో మందంగా సాగుతూం

టాయి. అంత సూతుని కుపిత హుంకార ధ్వనులతో అవి పునః శీఘ్రగతితో పురోగమించ సాగుతుంటాయి.

11. మాతా! హిమగిరి సుతా! సాగరుడు శ్రద్ధ, భక్తులతో అనేకానేక రత్నరాసులను నీకు బహూకరించెనా? లేక విశ్వకర్మ రోహిణ గిరితో, రత్నరాసులతో నీ సదనాన్ని నిర్మించెనా? కాకుంటే యీ మణిరాసులిట్లు ఆకీర్ణ మవడానికి కారణ మేమమ్మా! ఆ తెలిసింది. నీ సుందర కటాక్షావలోకన మాత్రంచే సంతుష్టుడై పరమశివుడు నాట్యమాడుతూంటాడుకదా! అప్పుడు నాగరాజైన వాసుకి వల్ల యీ మణిగణాలు వెదజల్లబడి ఉంటాయి.

12. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలందరూ తమతమ వాహనాలను దూరం లోనే విడనాడి, శిరస్సులు వంచి దోయిలించిన హస్తాలతో సంయమితేంద్రియులై భవదీయాగ మనార్థం నిరీక్షిస్తూండగా నీ రత్నమండపం నిండువెలుగుల పండుగ జేస్తూ వుంటుంది.

13. నీ రత్న మండపంలో మృదంగ కాహళాలు మ్రోగుతూ వుంటాయి. కిన్నరాంగనలు గానాలాపనం చేస్తూండగా దేవకన్యలు ఆడుతూ వుంటారు. ఉత్తమ సేవక జనంతో అధికానందాన్ని పొందుతూ నిత్యకళ్యాణంగా భాసిల్లే ఆ నీ రత్నమండపం సర్వదా నాకు సంతోషదాయకమగును గాక!.

14. దత్తచిత్తులైన నారీజనం లోపలికి వస్తూ, బయటకు పోతూండగా బయట వేచి వున్న అమర సముదాయం

వారిపట్ల భక్తిభావాన్ని ప్రదర్శిస్తూన్నారు. చిత్రవిచిత్ర సుందరాభరణాలుకల అట్టి నారీగణంతో నిండి యున్న నీ రత్న మండపం నాకు సదా శుభాన్ని చేకూర్చును గాక!

15. జననీ! నీ మంటప బహిఃప్రదేశము పెద్దవాకిలి, 'అక్కడ సువర్ణరత్నాలంకృతాలై, రంగురంగులు చీరలుకట్టి, బంగరు బెత్తాలు ధరించి దేవతలనందరినీ వారిస్తూన్న అగణిత నారీజనముచే అధిష్ఠింపబడిన పురోభాగం కలదై అలరారు తూన్నది. అట్టి నీ ప్రాంగణం నా మనస్సులో సర్వదా భాసిల్లు చుండును గాక!

16. అమ్మా! నాహృదయ కమలంలో ఆయుధాపాణులై వారివారి దిశలయందు ఇంద్రాదులైన అష్టదిక్పాలురు నారీ వేషాలను ధరించిన దిశాధినాథులను ధ్యానించి, శంఖంలో శ్రీవసుధా రతో వసుమతీ యుక్తమైన పద్మాన్ని స్మరిస్తూ అక్కడ రతీపతి అయిన మదనుని అతని సఖుడైన వసంతునీ ప్రీతితో మ్రొక్కి సేవిస్తున్నాను.

17. అవ్యక్త మధురస్వరాలు గల వీణతో గానం చేస్తూ, ఎడవెడ హుంకారం చేస్తూ ప్రాంగణంలో నివసిస్తూన్న సరస్వతీ దేవ్యాదులను పూజిస్తూ పోయి ద్వారంలో మదం వల్ల ఒళ్ళు తెలియని సురగణేశ్వరునీ, మదోన్మత్తయై కాలవర్ణం కల చీరను ధరించి ఒడలెల్ల ముత్యాల హారాలను అలంకరించుకుని అలరారుతూన్న మాతంగీ దేవిని

సేవిస్తూన్నాను.

18. కస్తూరిలా, కస్తూరిని అలంకరించడంవల్ల నల్లనై నిగనిగలాడే శరీరం కలదీ, మధుపానామృతమదాలసాలైన అంగాలుకలదీ, వామభాగాన కల స్తనంచే ఆలింగితమైన రత్నవీణ కలదీ అయిన మతంగముని పుత్రిని మనసా స్మరిస్తూన్నాను.

19. విరబోసినకేశకలాపంతో, ఊడిపోతూన్న వస్త్రాలు కలదానా! నిర్మలాభూషణాలతో తేజరిల్లుదానా! ఓ తిరస్కారిణీ దేవీ! నీ చరణారవిందాలను స్మరిస్తూ బ్రహ్మాది స్తంబ పర్యంతంగా గల పశు సమూహాన్ని మోహనామక క్షీర సాగరంలో నుదురు వరకూ మునిగిన దానినిగా భావన చేస్తూన్నాను.

20. మాతా! మత్తును కలుగ జేసే మధువును ఆస్వాదించడం వల్ల ఎఱ్రవారి తిరుగుతున్న నయనాలు కల దూతికలు, ప్రచండాసురులను సంహరించునట్టి వారూ, భక్తుల మానసాలలో ప్రవేశించునట్టి వారూ విలేపిత కజ్జల కాంతి సంతతులతో భాసిల్లునట్టి దేహాలు కలవారై ఓ చేత కపాలాన్నీ, మరోచేత శూలాన్నీ ధరించి వుంటారు. అట్టి నీ దూతికలను స్తుతిస్తున్నాను.

21. అమ్మా! నీ మణిమందిరానికిగల నాలుగు వాకిళ్ళు - తేజరిల్లు తూన్న యవధాన్యాంకురాలతో భాసిల్లే సువిశాల ప్రదేశాలలో సమక్షంలో స్థాపింప బడ్డ దీపాలతో అలరారే ముకుళిత సుందర ముఖాలు కల నవకుంభాలతో ప్రకాశిస్తూంటాయి. నీ వాకిళ్ళకు అమర్చబడిన కవాటాలు

బంగారపు కట్లతో విచిత్రాలైన రత్నాల చెక్కడాలతో తేజరిల్లుతూంటాయి. శైలసుతా! నాలుగు వాకిళ్ళతో కూడినట్టి నీ మణిమందిరానికి వందనం చేస్తూన్నాను.

22. మాతా! నీ మణిమండప మధ్యభాగం - పరువబడిన ఎఱ్ఱటి కంబళాసనాలతో పూలపరుపులతో. భాసిల్లుతూన్న అగణిత విశాలమణిదీపాలతో మనోహరమైన చాందినీలతో అందమై, వ్యాప్త ధూపసుగంధాలకు సంబరంతో పరివేష్టించి యున్న భ్రమరసమూహ నాదాలతో అలరారుతూ వుంటుంది. అట్టి శ్రీకరమైన నీ మణిమండప మధ్యభాగం నాకు సర్వదా శుభాలను వర్ధిల్ల జేయును గాక!.

23. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశాన, సదాశివులనే పంచప్రేతల హేమమయ దివ్యాసనంచే భాసిల్లు నట్టిదీ అగణిత మణి ఖచితమైనదీ, ఉపరి భాగంలో అరుణ, ధవళ వర్ణాలు గల వస్త్రాలచే ఉత్తమమైనదీ, దివ్యాలైన తలగడ, కాళ్లగడ దిండ్లతో సుఖప్రదమైనదీ, సుమసుగంధం కలదీ అయిన శయ్యపై నుండి నా హృదయ సరోజంలో సాక్షాత్కరించిన పరదేవతను నేను సేవిస్తూన్నాను.

24. సముచితంగా ఉండవలసిన తీరులో అవయవాలన్నీ ఉండగా రమ్యాకృతితో భాసిల్లుతూ - తూర్పు తెల తెలవారుతుండ గానే నిదుర లేచి ఆవులింత వల్ల సుందర వదనారవిందం కలదీ, మధుపాన మదం వల్ల అరుణకాంతులతో చరిస్తున్న నేత్రత్రయం కలదియై సేవించ దగ్గరగా వచ్చిన నిత్య సన్నిహితలైన సఖీజనాన్ని అవలోకనమాత్రంచే గౌరవిస్తున్న

పరదేవతను సందర్శిస్తూన్న - నా జన్మ చరితార్థమైనదిగా భావిస్తూన్నాను.

25. జననీ! శైలరాజ సుతా! బహిర్ద్వారంలో వివిధ వాద్యాల మ్రోతలు సమున్నతమై వ్యాపిస్తూన్నాయి. కిరీటాలు నేలను త్రాకునట్లుగ శిరస్సులు వంచి సాగిలపడి భక్త జనులు నీకు మ్రొక్కుతూ వున్నారు. ఈ ప్రాతర్వేళలో నానారత్న ఖచితమై, సువర్ణ కుంభంలో అలరారుతూన్న సముజ్వల నీరాజనాన్ని అమ్మా! నీకిదే కల్పిస్తున్నాను. స్వీకరించు తల్లీ!.

26. ఓ ఈశానీ! పాదప్రక్షాళనార్థం నీకు పాద్యాన్నిస్తూన్నాను. హస్తాలకు పూజా వస్తువులను అందిస్తూన్నాను. అమృతధా రాయుత మధుపర్కాన్ని సమర్పిస్తూన్నాను. శుద్ధమైన గంగాజలాలతో నేను కల్పించిన ఆచమనాన్ని ఆచరించు తల్లీ. మదీయ సాష్టాంగ ప్రణామాన్ని తిలకించి సార్థకం చెయ్యి.

27. జననీ! నా దృష్టిరూప నిర్మల దర్పణంలో నీ వదనారవిందాన్ని చూసుకో. గంగాజలాలతో కూడిన యీ దంతధావన చేసుకో. ముఖం ప్రక్షాళనం చేసుకుంటూనే మృదువైన వస్త్రంతో తుడుచుకొనుట నంగీకరించు. అమ్మా! ఆ పై మనోహరమైన తాంబూలాన్ని ఆస్వాదించుము.

28. మణిమయ నిర్మితాలైన పావు కోళ్ళపై నీ చరణ కమలాల నుంచు తల్లీ! సఖురాండ్రు అందించు నట్టి కరకమలాలను

పట్టుకుని నెమ్మది నెమ్మదిగా స్నాన శాలకు విజయం చెయ్యి. కరుణా సముద్రురాలా! దేవదేవేశ్వరీ! నీ కృపాకటాక్షావలోకనాలకై యిరువైపులా బారులు తీరియున్న సురసమూహాన్ని అవలోకించవమ్మా!.

29. బంగారంతో, రతనాలతో కట్టిన ప్రాకారమూ, విశాలాలై అరుణ వర్ణశోభితాలైన చాందినీల అలంకారం కలిగి, సిద్ధంగా ఉన్న దాసీ జనం గల - నా మనస్సు అనే స్నానగృహాన్ని తిలకించవమ్మా!

30. బంగారపు బిందెలు, చెంబులు, స్ఫటిక మణి పీఠం - ఆదిగా గల స్నానసాధనలతో నిండి - పరిమళంతో మదించిన భ్రమరపంక్తి తళతళలాడే ఎర్రని చాందినీలు గలదై, మనోహర గంధర్వ గానం గల స్నానగృహాన్ని - పరమశివదేవుని మహోత్సవాలకు స్థానమైన ఓ దేవీ! మెల్లగా ప్రవేశించవమ్మా!

31. పీనోన్నతాలైన పయోధరాలతో భాసమాన పూర్ణచంద్రసమ వదనం కల వారూ, సువర్ణ రత్నాదులతో తయారు చేయబడి తేజరిల్లునట్టి సన్నని చీరలు కట్టిన వారూ, స్నానార్థం హేమపాత్రలను, మెత్తని వస్త్రాలను, పుష్పాడి అయిన నలుగు పిండినీ, తైలాన్నీ దువ్వెననూ చేతులతో పట్టుకొనియున్న నీ దాసీలను గురించి ఓ తల్లీ నీకు ప్రణమిల్లుతూన్నాను.

32. తత్‌స్నాన మందిరంలో స్ఫటికమణిపీఠాన్ని అలంకరించి

మెల్లిగా ఆభరణాలను ఒలిచి, రైక మీదవున్న ఈషదరుణారుణంగా ఉన్న పైటను విడిచి, జడముడిని ఊడదీసి దువ్వేనచే కేశపాశంలోని చిక్కులను దీయించుకొనుచున్న - పరదేవత నా మనస్సులో భాసించునుగాక!

33. ఓ గిరిరాజనందినీ! మృదు తైలసంపాదిత అభ్యంగనాన్ని స్వీకరించు. కుంకుమ, అగురుద్రవ్యాలతో పరిమళించే కస్తూరీ జలాలతోను, సుగంధాలు వెదజల్లే యక్ష కర్దమ మిశ్రిత జలాలతోను, కుంకుమ పూవు మేళవించిన సలిలాలలో పూల జలాలతో కర్పూరం కలిసిన నీళ్ళతో, నిర్మలాత్మె, సర్వతీర్థాల నుండి తీసుకురాబడిన వేడి నీళ్ళతోను, చల్లటి నీళ్ళతోనూ భక్తితో నీకు స్నాన సలిలాలను సమర్పిస్తున్నాను. గిరిరాజనందినీ! వాటిని స్వీకరించ వమ్మా!

34. శుద్ధవస్త్రాలతో నీ సమస్తావయవాలనూ తుడిచి ఆరనిస్తూన్నాను. విశాలమైన నీ కేశపాశాన్ని ఉత్తమమైన ధూపంతో సువాసితం చేస్తూన్నాను. చెలియలందరి చేత నీకు చుట్టూ తెరను పట్టించినాను. భక్తజన సంరక్షణ దీక్షాతత్పరురాలా! మహేశ గృహిణీ! రతనాల కాంతులీనే స్నాన వస్త్రాన్ని విడిచి వేయుము.

35. ఓ చండీమాతా! నీకు సాంద్రమైన పట్టు గాగరాను సమర్పిస్తూన్నాను. సిందూర ప్రభలను అధఃకరించునట్టి మృదువైన వస్త్రాన్ని స్వీకరించి ధరించు తల్లీ!

ముక్తారత్నాదులతో చిత్రంగా అల్లిన బంగరు పోగులతో కూడిన తళతళ మెరిసే నల్లని రైకను - పరమేశ్వరునికి ప్రాణాధికప్రియురాలవైన ఓత్రిపుర సుందరీ మాతా! నీకు సమర్పిస్తున్నాను.

36. విరబోయబడిన కేశాలచే ఆచ్ఛాదితమైన భుజదేశం కల జననీ! మణిగణ ఖచితమై విరాజిల్లు తూన్న పాదుకలను తొడగిన మహేశ్వర గృహేశ్వరీ! శీఘ్రంగా వచ్చిన చెలియ బుజాన్ని లలితంగా ఆసరాగా పట్టుకొని అలంకార మండపానికి విజయం చెయ్యి తల్లీ!.

37. ఓ కాత్యాయనీ మాతా! తేజరిల్లే బంగరు కుట్టిమంలో తళుకులీనే మంచిముత్యపు రాసుల వల్ల తేజరిల్లే కాంతి పుంజాల వల్ల ఇంద్రధనుస్సమూహంలా ఉన్న విశేషాలంకార మంటపంపై ఉన్న హేమ సింహాసనం మీద సఖీజన పరివేష్టితురాలవైన జననీ! ఆసీనురాలవు కమ్మ.

38. మృదుకేశపాశాన్ని దువ్వెనతో మెల్లగా దువ్వి సుందరంగా విమలమైన పాపటను ఏర్పరచి ఆపై సిందూరపు రేఖ దిద్ది ముత్యాలు పొదిగిన ముంగరలు కల ఆ జడను మణులు గ్రుచ్చిన బంగరు తీగెతో ఆ ప్రాంతమందు ముత్యాల జాలరులు వ్రేలాడు నట్టి సొబగుగల దానినిగా చేస్తున్నాను.

39. వ్రేలాడే జడ అనే త్రాచు శిరస్సుమీద ధగధగ మెరిసే మణి భ్రాంతిని కలుగ జేసేదీ, నిజప్రభలతో ఉల్లసిల్లజేసే కేశపాశం కలదీ అయిన చూడామణిని ఓ మహేశ్వరీ!

నీకు సమర్పిస్తూన్నాను.

40. ఓ మృడానీ! (శివునిరాణి) అంధకారం వంటి నీ నల్లని కొప్పులో సూర్యబింబంవలె ప్రకాశించే చూడామణితో నున్న నీ శిరస్సునకు ప్రణమిల్లు తూన్నాను.

41. సువర్ణ నిర్మితమై, మణికాంతులతో మధ్యభాగం ప్రకాశించు చుండ, వ్రేలాడే ముత్యాల సరాలు పరివేష్టించి యుండ రాజిల్లునట్టిదీ, పరమ శివదేవుని అచంచలదృష్టులచే సంభావింపబడునదియు అయిన నీ ఫాలసీమలో వ్రేలాడునట్టి ఫాలభూషణాన్ని ఓ భవానీ! నీకు సమర్పిస్తున్నాను.

42. అమ్మా! నీ కమలనేత్రాలు, మీనాల, పద్మాల, ఖంజరీ పక్షుల - శోభలను తిరస్కరించునట్టివీ, మదనారి (శివుని) మానసంలో సుమశరుని బాణప్రభాభ్రాంతిని కలిగించునవీ, మధుపాన మదంవల్ల అరుణారుణాలై అలరారుతూన్నాయి. ఆ నీ సువిశాల చంచల నయన కమలాలయందు అమ్మా! యీ సువర్ణశలాకతో దివ్యాంజనాన్ని పెట్టుకో తల్లీ!

43. మధ్యభాగం పద్మరాగంతో అలరారు వదన భాగాన ముత్యంచే భాసిల్లునట్టి యీ నాసాభరణం - విధి వశాన ఎన్నడైనా శుక్రబృహస్పతుల మధ్యకు చేరిన భాస్కర ప్రభలను అధఃకరించుచున్నది. బింబఫల సమమైన అధర కాంతితో - కుజునివలె కన్పించు ముక్తామణికలదై నాచే నీకీయ బడిన యీ బులాకీని గిరిరాజ తనయా! ధరించి స్వీకరించవమ్మా.

44. చంద్రునికి చుట్టూ తారలచే చేయబడిన పరివేషమందలి

అసూయ వల్ల భాను బింబంబం రెండుగా మారినదా? అన్నట్లున్నదీ అరుణ మణి ప్రభలతో సర్వే. సర్వత్రా ప్రకాశించు నట్టి ముత్యాలచే అలరారునదీ బంగరు కమ్మల జంట నిచ్చుచున్నాను. వీటిని నీ కర్ణద్వయానికి అలంకరించు కోవమ్మా!

45. జననీ! ఈ కంఠహారాన్ని అందుకో. మరకత, పద్మరాగ, వజ్రాలను సానబట్టి గుండ్రంగా చేసిన మూడు పూసలతో వ్యాప్తమైన మధ్యభాగం కలదై, నిర్మలమైన ముత్యాలు కలిగిన యీ హారాన్ని సాదరంగా ధరించవమ్మా!

46. వివిధదేశ ఖ్యాతి గాంచిన అగణితమణిగణప్రభలచే వ్యాప్తమైన నగలు, పతకము కంఠాన్ని భాసిల్ల జేయుచున్నవి. ముత్యాలు చుట్టూ పొదగ బడగా మధ్యభాగాన అరుణమణి యిరు వైపుల ముత్యాల గుత్తులు కలిగి ప్రకాశిస్తూన్న యీ పతకాన్ని శివానీ! మాతా! దీనిని నీ వక్షఃస్థలాన ధరించవమ్మా!

47. జననీ! ముత్యాలతో, పద్మరాగాలతో, మరకత మణులతో తయారైన యీ ముప్పేటహారం - నిరంతర ప్రవాహం కలిగి, పరస్పరం - ఆప్లావితమవుతూ గంగాయమునా సరస్వతీ సంగమస్థానమైన ప్రయాగ వంటిదై స్నానమాడు వారి చిత్తమాలిన్యాన్ని క్షాళితం చేస్తూన్నది. పరమశివ రసికురాలా! ఏవం విధవిశిష్టగుణ సంపన్నమైన నీ హారం మా మనస్సులలో భాసిల్లును గాక!

48. మాతా! ఇదిగో బంగరు దండకడియాల జంట. నీ అరచేతులు పద్మాలవంటివికాగా, నీ భుజాలు వాటి కాడల వంటివై విశేషంగా గోచరమవుతూ విశేషంగా స్ఫురించే ప్రభా పుంజంతో అలరారుతూ, నిర్మల శోభతో చంచలాలైన శివదేవుని ·నయనాలకు లోభాన్ని కలుగజేస్తు న్నాయి. అమ్మా! దుర్గా! నీ రెండు భుజాలకు, వివిధమణి ప్రభావిరాజితాలైన యీ బంగరు కడియాలను రెంటినీ పెట్టుకోవమ్మా!.

49. జననీ! యివిగో భుజకీర్తులు. తెల్లని పట్టు కుచ్చులు వ్రేలాడ అందాలు చిందులాడ, తళ తళలాడే మణిహార విరాజితాలైన యీ బాహుపురులను రెంటినీ - మహేశ్వర గృహేశ్వరీ! మాతా! నీ బాహుమూలాలలో బంధిస్తున్నాను.

50. మహేశ్వరీ! మణిమయాలైన దండకడియాలతో కూడిన కరకంకణాలివిగో. విశేషకాంతులు గల యింద్రనీలాలతో నిర్మించబడి తామరపూవుకాడ మీద వ్రాలిన మదించిన భ్రమర పంక్తులను జయించిన యీ కంకణాల మొత్తాన్ని హస్త మూలంలో ధరించ వమ్మా!

51. మృదువైన నల్లని పట్టు గుత్తులతో అలరారుతూ అలంకృతమైన మణిజాలాలతో మనోహరమై భాసిల్లునట్టి బంగరు రేఖగల గోటును - కంకణం కన్న ముందు భాగంలో ధరించ సమర్పిస్తూన్నాను తల్లీ!.

52. బాలవిద్రుమ లతలతో మదనుడు నిర్మించిన పాదులా వున్న మదీయార్పితమైన అంగుళీయకాన్ని జననీ! మెల్లిగా నీ వ్రేలికి పెట్టుకో వమ్మా!.

53. శివుని జయించిన మన్మథుడనే మదపుటేనుగు కుంభస్థలాన్ని విదిలించడం వల్ల మ్రోగుతూన్న గజ్జెల సమూహంచే సమానమైన నిర్విరామ మధుర నాదాలతో మహేశ్వరుని చిత్తాన్ని ఆకర్షించునట్టి వివిధ మణి ఖచితమైన ఒడ్డాణాన్ని అమ్మా! నీకు సమర్పిస్తూన్నాను.

54. వ్రేలాడే మంచి ముత్యాల గుత్తులలరారుతూ, ప్రకాశించే బంగరు డిప్పల జంటతో అలంకరించబడి అగణితమణులు పేర్చిన మొలనూలును-పోకముడిని బంధించ సమర్పిస్తూ న్నాను.

55. జననీ! క్రొత్త లత్తుక పంకంతో పూయబడిన నీ చరణారవిందం, మరకతమణి పంక్తులతో మనోహరాలైన అందెల సవ్వడులతో రాజిల్లుతూ వుంటుంది. దాని యందు పద్మరాగమణి బహిర్గత ప్రభాధారతో విచిత్రంగా అలంకృతమై ఉన్న 'హంసకం' ప్రీతిని పొందును గాక!.

56. బంధింపబడినవియై, మేలైన నల్లని గుత్తులతో శోభించునట్టీ, అవ్యక్త మధురధ్వనులతో మంజులమైనట్టీ, పరమేశ్వరుని మనస్సును మోహించునట్టినీ, అగణిత మణి సమూహ ప్రభలతో చిత్రవర్ణమైన యీ బంగరు ఘుం ఘురువును అమ్మా! నీ పాదకమలాలలో అలంకరించుకో.

57. ప్రకాశించే సహజారుణ ప్రభారంజితమైన నీ పాదపంకజంలో - కలకల ధ్వనితో అలరారే పద్మరాగమణి స్థగితాలైన అందియల జంటను నీ సఖురాంద్రచే అలంకరింప జేయుచున్నాను.

58. ఓ మహేశ్వరీ! నీ చరణ కమలాలను ఆరాధించ వచ్చిన చంద్రుని చే దాల్చబడిన సంధ్యా రాగారుణాలైన సూక్ష్మశరీరాల పరంపరల వంటి - నవ్యలాక్షారసపు విశేషమైన పూతచే యితోధికారుణిమత్వం పొందిన భవదీయ చరణ పంకజ గతమైన నఖమండలికి ప్రణమిల్లుతున్నా నమ్మా!.

59. జననీ! అమరభామినులు విశేష ప్రయత్నపూర్వకంగా ఎర్రనీ, తెల్లనీ, పచ్చనీ, వికసించిన పువ్వులను చిత్రంగా పట్టుదారాలతో మధ్యభాగంలో గుచ్చి దివ్యాగురు ధూపాలతో సువాసితం చేసిన ఎర్రకలువపూల మాల యిదిగో. పరిమళించే సుగంధాలను ఆఘ్రాణిస్తూ - కన్నా మిన్నా కానని మత్త భ్రమరాలతో ఆరంభమైన 'ఝా'మ్మను సంగీత నాదాలతో అలరారుతూన్నది. పరశివ రసికే! ఈ సుమమాలను నీ గళసీమలో ధరించవమ్మా!.

60. జననీ! ఈ బంగరు గిన్నెలో వున్న యీ పరమామృతాన్ని పానం చెయ్యి. నీ ముఖ కమలంలో నిర్మలమైన యీ తాంబూలాన్ని వేసికో. నిర్మలమైన యీ దర్పణంలో నీ వదనకమలాన్ని చక్కగా చూసుకో. రత్న ఖచితమైన

యీ పాదుకలపై పాదార విందాలను మెల్లగా వుంచు తల్లీ!

61. తనకు దగ్గరగా నున్న చెలికత్తె చేతిని ఆలంబనం చేసికొని, నెమ్మదిగా సింహాసనం మీది నుండి లేచి, మధురనాదాలు చేస్తూన్న హంసల మందమనోహర గమనాలతో మెరుస్తూన్న వస్త్రాభూషణాలు కలదై - ఆనందాన్ని అందించే ఉపనిషద్దేవతలు-వాక్యస్తుతులతో ప్రశంసిస్తూ వెంట రాగా సభామండపానికి విజయం చేస్తూన్న గిరిరాజనందిని నా చిత్తంలో స్థిరంగా వుండును గాక!.

62. మా తల్లి కొద్దిగా కదులుతుండగానే యావత్ పరివారమూ సావధానంగా వెంటనంటి రాగా బంగరు బెత్తాల్ధు ధరించిన వేగులు ముందు నడుస్తూ సందడి చేయ, పురోగమిస్తున్న భువనజనని విశేషంగా చేస్తున్న పాదన్యాసం వల్ల జనించిన ఝుణత్కారాలతో ప్రతిధ్వనించసాగింది.

63. చేతనున్న బెత్తాలను యిటునటూ ఆడిస్తూ విశేష వస్త్రాభరణాలను ధరించి ముందుగా పురోగమించునట్టి దాసీ జనం - అమరసమూహాలను యిటూ అటూ తొలగించి ముందర విశ్రాంతి జేస్తుండగా, ప్రాంగణ మంతా అమరవనితలచే పరివేష్టింప బడియుండగా విజయం చేసి -మహేశ్వరునికి మహానందాన్ని కలిగిస్తూన్న నిర్మల చిదానందైకరూపాన్ని నేను ప్రణామపూర్వకంగా సేవిస్తూన్నాను.

64. ఆ త్రిభువన జనని పాద సమీపంలో బ్రహ్మదేవుడు పడుతూన్నాడు. ఇదిగో పద్మనాభుడు ప్రణమిల్లు తూన్నాడు. సమక్షంలో శివుడిడుగో. క్రీగంట యిటు చూడు తల్లీ! అడుగో! దూరంలో ఉన్న మహేంద్రుని తిలకించవమ్మా! అంటూ పరిచారికలు పలుకు తూండగా సముచితంగా వారివారి వైపు చూస్తూ ఆదరిస్తూన్న భగవతి నాకు ఐశ్వర్యాన్ని ప్రసాదించును గాక!.

65. ఉత్కంఠగా మందగమనంతో నిన్ను పరివేష్టించియున్న చారణాంగనలు సర్వ దిశల యందూ ఎలుగెత్తి పేరెట్టి ప్రత్యేకంగా చెబుతూండగా శీఘ్రంగా సమక్షంలో కానవస్తూన్న అమర గణాన్ని వాత్సల్యంతో తిలకిస్తూ మార్గంలో పాదారవిందాన్ని నెమ్మది నెమ్మదిగా ఉంచదలచు నట్టి మహేశ్వర గృహేశ్వరి లోకాల నన్నింటినీ పాలించును గాక!.

66. ఓ గిరిరాజ సుతా! ఈ దేవతలలో ముందు వెనుకల కొందరూ, కొందరు ఉభయ పార్శ్వాలలోనూ ఉండి పురోగమిస్తున్నారు కొందరు అంబరవీథిలో నున్నారు. మరికొందరు దిశలలో నిలచియున్నారు. ఒత్తిడిని మెల్లగా తొలగించి కొందరు మాటి మాటికీ సాష్టాంగ దండప్రణా మాలు చేస్తూన్నారు. వీరందరి కందరూ అమ్మా! నీ కరుణారస దృష్టులను కోరుతూన్నారు.

67. నీ సమక్షంలో కిన్నర గణం అవ్యక్తమధుర పదాలను

గానంచేస్తుండగా, గంధర్వ భామినులు సవ్యాపసవ్యాలలో నిలచి మెల్ల మెల్లగా మధురంగా వాద్యాలను వాయిస్తున్నారు. దేవకాంతలు గల గల మనే అందెల రవళులతో యింపుగా ఆడుతూన్నారు. పరివేష్టించి పురోగమిస్తూ బ్రహ్మాదులు వేద స్తవాలతో నిన్ను కొనియాడుతూన్నారు.

68. చిరకాలంగా ఉపాసింపబడు మహామంత్రాలసిద్ధిని ఒకనికీ, సంసారమందు ఆసక్తి లేని వేరొకనికి పరమానందానుభవ స్వరూపమైన గమనికనూ, యితరేతర విషయాలయందు ఆసక్తికలవాడై వాకిలి కాచుకున్న దరిద్రునికి దుఃఖాలన్నింటినీ దూరం చేయునట్టి అర్థాన్నీ క్రమంగా అనుగ్రహిస్తున్న త్రిపుర సుందరీ మాతకు వందనాలర్పిస్తూన్నాను.

69. దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘ - నామాలు కల పంక్తి త్రయానికి బద్ధాంజలి - భక్తిని వ్యక్తం చేస్తూ, ప్రసన్న వదనాలతో, సమీపంగా, ఔత్సుక్యభావంతో మందగమనం చేస్తుండగా వివిధ మన్త్ర పాఠాన్నీ, మంత్రార్థాన్నీ, వాటిని సాధించే ఉపాయాన్నీ, తత్ఫలాన్ని గురించి వ్యాఖ్యానం చేస్తూన్న - కాంతులను ప్రసరించు ఆది తేజాన్ని నేను భావిస్తూన్నాను.

70. పరమేశ్వరుని ప్రియురాలా! అమ్మా! నీ మందిర ప్రాంగణంలో నిత్యం నివసిస్తూ అగ్నిగణ సమ అరుణ నేత్రాలతో సర్వులనూ భయభీతులను చేస్తూన్న భయంకర ముఖులయిన శరభేశ్వరీ శరభేశ్వరులకు విశేష భక్తితో

ప్రణమిల్లు తూన్నాను.

71. అమ్మా! శ్రీ చక్రాకారంలో భాసిల్లే నీవేదిక మణిస్తంభాలతో కూర్చబడిన బంగారు తీగెలతో భాసిల్లునట్టి ఉత్తమ విమానంతో, కర్పూర, అగురు పొడులు లోపల చేర్చబడి మెదిపిన వత్తులతో వెలిగించిన దీపమాలలతో స్ఫురిస్తూన్న మణిగణాలు కలదై - ప్రళయవేళలో ఏకకాలాన సరసంగా తోచిన అగణిత భానుసమ దివ్యప్రభలను ప్రసరింపజేస్తూ న్నది. అట్టి శ్రీ చక్రాకృతిలోనున్న నీ వేదికకు ప్రణమిల్లుతూన్నాను.

72. వివిధ రత్న సువర్ణ ప్రభలతో - మేఘాలు క్రమ్మిన దివసాన్ని ఏర్పరుస్తూ అలరారుతూన్న పూలదూది పరుపులు కలదియై కామేశ్వరునిచే అధిష్ఠితమై, నిత్యానంద స్థితికి ఆలవాలమైన సింహాసనం - స్వస్థానాలయందు రాజిల్లుతూన్న అమర సమూహాలచే ఆవరింపబడిన బిందువులో ఆనందంగా వుంచబడింది. తల్లీ! అట్టి సింహాసనాన్ని వినమ్రుడనై భావిస్తూన్నాను. నా హృదయ సీమలో అది సదా సన్నిహితంగా వుండునట్లు అనుగ్రహించుము.

73. ఆనందాతిరేకంతో బృందారక సందోహం దశదిశలనుండీ 'జయజయకారాలు' చేస్తూ బద్ధాంజలురై ఆసీనులై యున్నారు. జననీ! నీ కరుణాకటాక్ష వీక్షణాలతో వారి అంజలిపంక్తిని సార్థకం చేస్తూ అమూల్య మణిఖచితమైన

- సఖీజనపరివేష్టితమైన కాంచన సింహాసనాన్ని అధివసించవమ్మా !.

74. అమ్మా ! సేవికలు కస్తూరీ, కర్పూరాది సుగంధద్రవ్యాల నన్నింటినీ బంగరు కూజాను, మణిఖచిత తాంబూలపేటికనూ, చేలాంచలాన్నీ దర్పణాన్నీ, భాసమాన మణి ఖచిత పాదుకలనూ తీసుకొని నీ సింహాసనాన్ని పరివేష్టించి సావధానంగా నిలబడి వున్నారు. త్రిపురసుందరీమాతా ! వారిమ్రొక్కులతో నీకు వందనం చేయుచున్నాను.

75. అమ్మా ! భవదీయ నిర్మల దేహకాంతి తరంగ పుంజములచే భాసిల్లుతూన్న బాహు చాలన విలాసం కల చామరగ్రాహిణులచే - చంద్రకిరణ స్వచ్ఛాలై పదే పదే వీవబడుతూన్న చామరాలను వీవ జేసే కర్తృత్వాన్ని నేను వహిస్తూన్నాను జననీ !

76. ఓ మహేశ్వర గృహేశ్వరీ ! ఉదయ భాస్కర సమ సుందరమైన హేమచ్ఛత్రమిదిగో - ధగ ధగ మెరిసే ముత్యాలు గుత్తులు గుత్తులుగా యీ ఛత్రానికి చుట్టూ కొనలలో వ్రేలాడ, సుందరదివ్యమణిఖచిత సువర్ణ దండంతో విశేషసుందరంగా ఉన్న యీ ఛత్రాన్ని నీకు పడుతున్నాను.

77. భాసిల్లుతూన్న నీ దివ్య దేహకాంతి పుంజసింధూర ప్రవాహ ప్రభలతో ఎఱ్రవారి, విశేషారుణిమత్వంకల మణి ఖండం వంటి ప్రభలు కల యీ సువర్ణచ్ఛత్రాన్ని అమరగణాలు దూరం నుండి సాదరంగా అంజలి బద్ధులై సందర్శిస్తు

న్నారు. ఇట్టి భవదీయ అనుపమాన హేమచ్ఛత్రానికి నేను ప్రణమిల్లు తూన్నాను జననీ!.

78. మాతా! పరమామృత రసంతో సంతుష్టినొందిన దానవై అలరారే కామేశ్వరుని వామాంకంపై పూలసమూహాలచే ఆరాధింపబడుతూన్న షడ్గుణైశ్వర్య సంపన్నవైన నిన్ను - శ్రీ చక్రావరణాంతర్గత దేవతలు ప్రసన్నంగా మ్రొక్కుతూ - దివ్య ప్రభలతో తేజరిల్లే నీ దివ్య దేహకాంతులతో లయమై నీ రూపంతో భేదం లేని వారవుతూన్నట్లు గోచరించు వారందరికీ వినయంగా నమస్కరిస్తూన్నాను.

79. అమ్మా! గిరిజాదేవీ! నీ శ్రీ చక్రంలో ఆధారశక్తి ఆదిగా గల శక్తులనూ, మధ్యస్థానంలో సర్వాధికురాలయిన యోగినిని ఆరాధించి మిత్రేశాది నాథ చతుష్టయానికి ప్రణమిల్లుతున్నాను.

80. పరమేశ్వరీ! భవదీయమైన అష్టావరణల యందు త్రిపురాశక్తియొక్క సుధాసాగరాది త్రిపురమాలినీ పర్యంతం వ్యాప్తమైయున్న ఆసన షట్కానికి ప్రణమిల్లు తూన్నాను.

81. జననీ! విజృంభించే విఘ్నాంధకారాలను రూపుమాపునట్టి గణపతిని ఈశాన్య భాగంలోను, నాగయజ్ఞోపవీతాన్ని దాల్చి కజ్జలకాంతితో భాసిల్లు వటుక భైరవ స్వామిని వాయవ్యదిశలోనూ, నైరృతి దిశలో మహిషాసురమర్దిని అయిన దుర్గామాతానూ, ఆగ్నేయ భాగంలో భక్తజన

సంరక్షణ తత్పరుడైన క్షేత్రపతినీ ఆరాధిస్తున్నాను.

82. మాతా! నీ చక్రంలో త్రికోణానికి కుడివైపుగా ఉన్నై ఓడ్యాణ పీఠం అగ్రభాగంలో జాలంధరీ పీఠం, వామభాగాన కామరూప పీఠం, మధ్య భాగాన కామగిరి పీఠాలు సిద్ధప్రదాలై తేజరిల్లుతూన్నాయి ఈ పీఠ చతుష్టయానికి నేను ప్రణమిల్లుతూన్నాను. భూ తత్వానికి బ్రహ్మ, జలతత్త్వానికి విష్ణువూ, తేజోమండలానికి ఉమాపతీ, వాయుమండలానికి ఈశ్వరుడూ, ఆకాశానికి సదాశివుడూ అధినేతలై భాసిల్లుతూన్నారు. పంచప్రేత నామాలు కలవారై శ్రీ చక్ర బహిర్భాగాన తేజరిల్లు తూన్న వీరైదుగురికీ ప్రణమిల్లుతూన్నాను.

83. జననీ! చంద్రకళా ప్రవేశ - నిర్గమాలన్న మిషతో ప్రేతలని ఖ్యాతిగాంచి జగత్రయంలో తిథులయందు కల కాష్ఠ ఆదిగాగల కాలక్రమాన్ని ప్రవర్తిలజేయుచు రత్నభూషణ, చిత్రవిచిత్ర వస్త్రాలతో లలితమైన శ్రీ చక్రానికీ - సాధకునికీ మధ్య తేజరిల్లుతూన్న కామేశ్వర్యాది షోడశ తిథి నిత్యలకు ప్రణమిల్లుతూన్నాను.

84. నిజగురుక్రమమన్న పేరుతో శ్రీ చక్రరాజంలో వున్న యోఘత్రయము, హృదయంలో నిశ్చితదేవతాస్వరూపం కలది, సప్రయత్నంగా ఆప్తితో రహస్యోపదేశం చేసి భక్త సమూహాలను అనుగ్రహించునట్టిదీ అయిన ఓఘత్రయానికి వినయంగా శిరసువంచి ప్రణమిల్లుతూన్నాను.

85. సర్వాద్యురాలవైన జననీ మునిజనచింతితమగు. 'హృదయ, శిర, శిఖ, కవచ, నేత్రత్రయ, అస్త్రాలనే యీ షడంగాలు సదా మదీయహృదయంలో స్ఫురించుచుండును గాక!.

86. భాసమాన దివ్యాభరణ సమూహాలు కల త్రిపురాదేవికి వాసస్థానమై త్రైలోక్యమోహనమన్న ఖ్యాతిగల రేఖాత్ర యంలో ప్రకట యోగిను లన్న పేరు గల అణిమాది సిద్ధులనూ, సర్వసంక్షోభిణ్యాది ముద్రలను సర్వదా వినయ భావంతో నేను సేవిస్తూంటాను.

87. భాసిల్లునట్టి త్రిపురేశ్వరికి వాసస్థానమై షోడశదళయుక్తమై 'సర్వాశా పరిపూరక'మన్న నామ ప్రసిద్ధమైన చక్రంలో వసించునట్టి గుప్తయోగినులు మణిగణ సుశోభితలు, దివ్యాంబరధారిణులు అయిన కామాకర్షిణ్యాదులు అభీష్ట ఫలాలను అనుగ్రహించెదరు గాక!.

88. ఓ మహేశ్వరీ! సర్వాభరణాలతో శోభిల్లు త్రిపుర సుందరికి వాసస్థానమై అష్టదళాలతో అలరారు నట్టి సర్వసంక్షోభణ చక్రంలో వివిధాలంకార సుశోభితాలైయున్న అనంగకుసు మాది గుప్తతరయోగినులు మదీయాభీష్టాలను నెరవేర్చెదరు గాక!.

89. శుభాభరణ విభూషితయైన త్రిపూరవాసినీదేవికి వాసస్థానమై షోడశదళాలు కలిగిన సర్వసౌభాగ్యదాయక చక్రంలో ఉన్న సంప్రదాయ యోగినులనే పేరుగల సర్వసంక్షోభిణ్యాది సుందరులూ! - సర్వసిద్ధి ప్రదలూ మాకు శుభాలను

చేకూర్చెదరు గాక!.

90. బహిర్దశారమగు సర్వార్థ సాధక చక్రంలో త్రిపురా శ్రీదేవి నాశ్రయించిన సర్వసిద్ధులను ప్రసాదించునట్టి కులోత్తీర్ణ యోగినులు మమ్ములను సంరక్షించెదరు గాక!.

91. త్రిపుర మాలినీ దేవికి వాసస్థానమై అత్యంత సుందరమైన అంతర్దశారీ రూపమైన సర్వరక్షాకర చక్రమున సర్వదా వశించు నిగర్భయోగినులు అన్న నామాలు కలిగి నానారత్న విభూషితలై, మణిమయ దివ్యాంబర విరాజమానలగు సర్వజ్ఞాది శక్తిగణానికి నేను సదా నమస్కరిస్తూంటాను.

92. త్రిపూరాసిద్ధ్యంబతో కూడిన అష్టదళాలు కల సర్వరోగహర చక్రంతో నిత్యం వశించు నట్టి వశిన్యాది రహస్యయోగినులకు నేను నిత్యం మ్రొక్కుతూంటాను.

93. చూతాశోక కేతక నీలాంబుజ నవమల్లికలనే పంచబాణా లనూ, రమ్యమైన సుమశరాసనాన్నీ. లలితమైన పాశాంకుశా లనూ మాతా! శ్రీ చక్రమధ్యంలో ఉన్న నీ యీ దివ్యాయుధాలకు ప్రణమిల్లుతూన్నాను.

94. త్రిపురాదేవిచే అధిష్ఠింపబడి సర్వసిద్ధిప్రదమన్న నామం గలిగిన లోకంలో కాంతులను విరజిమ్ము త్రికోణంలో ఉన్న కామేశ్వరీమాత నాకు శుభపరంపరలను చేకూర్చును గాక! అక్కడ తేజరిల్లు వజ్రేశ్వరీదేవి సమస్త శుభాలనూ ప్రసాదించును గాక! భగమాలినీదేవి నా మనస్సులో భాసిల్లాలని ప్రార్థిస్తూన్నాను. సర్వులచే కోరబడు

'సర్వానందమయ' నామం కల బైందవ చక్రంలో త్రిపుర భైరవీ విరచితమైన ఆవాసంలో ఉన్న ప్రసన్న వికసిత నయనాలు కలదీ మణిమయ వస్త్రాభరణాలు ధరించి, ప్రకాశించునదీ, భాసమాన సుందర వదనారవింద విరాజమాన అయిన మహాత్రిపురసుందరీదేవి - పరాపర రహస్య యోగిని నన్ను పాలించును గాక!.

95. సువర్ణకాంతులతో అలరారుతూ, వికసించి సుగంధాన్ని సర్వత్రా వ్యాపిల జేయుచు భ్రమరాలచే దూరంగా విడువబడిన చంపక పుష్పాన్ని ఓ తల్లీ! సమర్పిస్తున్నాను.

96. విశేష విరోధాన్ని విడనాడి శంకరుడు చంద్రకళను శిరసున ధరించిన, సుగంధా సక్తాలైన భ్రమరాలచే సదా ఆశ్రయింప బడిన కేతకీ కుసుమాన్ని అమ్మా! నీకు సమర్పిస్తున్నాను.

97. నీ వదనంతో విరోధించడం వల్ల శీఘ్రమే బ్రహ్మచే చూర్ణం చేయబడినదా ? అన్నట్లున్న వికసించిన జాజిపూలమాలలు- యివిగో అంజలి దాల్చి నీకు సమర్పించుకుంటూన్నాను.

98. విశేషమైన అగురు ధూపాల నిర్విరామ పరిమళంతో మనోహరమైనదీ కాంతిలో మరకత మణిగణ ఖచిత మనోహర హారాన్ని బోలినదీ, దిశా, విదిశలయందు వ్యాపించు సుగంధాలపై భ్రమర సముదాయం కల వకుళమాలను నీ గళ సీమలో అలంకరిస్తున్నాను.

99. ''ఈ'' కారోపరిభాగాన గల బిందువు నీ ముఖము కాగా అధోభాగాన కల బిందుద్వయం నీ స్తనద్వయము.

రేఖాత్మకము, భావనా గమ్యము అయిన దీనిని సద్గురువు ద్వారానే గ్రహించాలి. ఏవంవిధ విశిష్టగుణ సంపన్నమైన కామకళాత్మిక యగు భగవతిని అంతరంగ మందు ఆరాధించునట్టి సాధకుడు ఆనందసాగరంలో మునిగి తేలుతాడు.

100. జననీ! భగవతీ! విశేషపరిమళాన్ని వెదజల్లునట్టి అగురు ధూపాన్ని నీకు సమర్పిస్తూన్నాను. తేజస్సు ద్వారా అజ్ఞానాంధకారాన్ని రూపుమాపు నట్టి దీపాన్ని కూడ వెలిగిస్తూన్నాను. పరమానంద స్వరూపిణీ, త్రిపుర సుందరీ దేవీ! రత్నమయాలైన స్వర్ణ పాత్రలలో ఉంచబడిన అవసర నైవేద్యాన్ని అర్పిస్తూన్నాను.

101. జాజి మొగ్గల వలె - మెతుకు - మెతుకు కలవ కుండ ఉన్న శుద్ధాన్నం బంగరు పాత్రలలో ఉంచబడింది. సదాచార సంపన్నాలైన పెసర, మినప, శనగ పప్పులు, గేదె పెరుగు గో దధిని మథన చేయగా వచ్చిన నవ్య నవనీతాన్ని యిప్పుడే కాచి సిద్ధపరచిన నేయీ - వేర్వేరు పాత్రలలో వుంచబడ్డాయి వీటన్నిటినీ శివానీ! గ్రహించు తల్లీ.

102. ఓ గిరిరాజనందినీ! సొరకాయ, దొండకాయ, తోటకూర గుమ్మడికాయ, బీరకాయ, వంకాయ, పొట్లకాయ, మొదలగు శాకాలను సన్నని సెగకల నిప్పు దగ్గర తయారు చేయించి పోపులతో దివ్యంగా సంపన్న మొనర్చి సువర్ణ

పాత్రలలో వాటిని పేర్చి భక్తి భావంతో నీకు నివేదిస్తూన్నాను.

103. చిదానంద స్వరూపిణీ! గిరిజామాతా! అల్లం నిమ్మకాయ మామిడిపిందెలు, దుంపకూరలు, అరటి, బీర, దోస, ఉసిరి మారేడు ఆదిగా గల కాయలతోను, కరీరములతో (వెదురు మొలకలు) తయారు చేయబడి, కారము, తైలము, సైంధవలవణము, పసుపు - వీనితో ఉపలక్షితమైన వివిధాలయిన చిత్రాన్నాలను నీకు నివేదన చేస్తున్నానమ్మా!.

104. శర్కరతో తయారుచేసిన లడ్డూలను, మెత్తటి అప్పాలను, పూరీలను, పరమాన్నాన్ని పార్వతీ మాతా! నీకు భక్తితో సమర్పిస్తూన్నాను.

105. చక్కగా చేసిన కోవాపాకాన్ని, చంద్రమండల సదృశమైన గడ్డపెరుగును కండ చక్కెరను, పంచదార చల్లిన మెంతిమజ్జిగను, ఓ యమ్మా! నీకు సమర్పిస్తున్నాను.

106. విశేషమైన నైవేద్య సర్వస్వాన్ని ముందుగా నీకు నివేదించి అది నీచే స్వీకరింపబడినది గ్రహించి ప్రథమంగా తత్వ చతుష్టయం (స్థూల-సూక్ష్మ-కారణ - మహా కారణ శరీరాలు) సంతుష్టి చెందినట్లు భావిస్తూన్నాను. ఆపై దేవేశ్వరీ! శంభుప్రియే! ఆ పై బంగరు మూకుళ్ళలో ఉంచబడిన శేషపదార్థాన్ని నీ పరివారశక్తులకు సమర్పిస్తూన్నాను.

107. వామహస్తంలో క్షీరాన్న యుక్తమైన అనుపమ స్వర్ణ పాత్రనూ, దక్షిణహస్తంతో స్వజనుల మనోభీష్టాలను నెరవేర్చునట్టి బంగరు గరిటెనూ ధరించి వివిధమణి ఖచితాభరణాలను ధరించి మృదువైన నీలచ్ఛాయ గలిగి, మధుమదంతో ప్రసన్న చేతస్కవై నీ సమక్షంలో రాజిల్లుతున్న అన్నపూర్ణా దేవికి ప్రణామాలందజేస్తూ న్నాను.

108. వామదేశంలో స్వశక్తులచే ఆలింగితులై శ్రీ చక్రాన్ని పరివేష్టించి పంక్తులుగా కూర్చున్న నీ పార్షదులను పూజించి మ్రొక్కుతూన్నాను.

109. పరమామృత పానం వల్ల మదించిన సుందరీ బృందాల మధ్యభాగంలో భాస్కర సమంగా భాసిల్లుతూ పరమా మృత పానం వల్ల ఘూర్ణిల్లునట్టి నయనాలు కల వర్ణనాతీత పరంజ్యోతిని ఉపాసిస్తూన్నాను.

110. అమ్మా! నీ వదనారవిందం కనిపిస్తున్నది. అనాహత చక్ర బహిర్గత నాదం స్పష్టంగా విన వస్తూన్నది. వాగతీతమైన భవదీయాంతరార్చన కారణంగా మనస్సు యితరేతర విషయాలను దేనినీ అందుకోవడం లేదు.

111. ఓ పరమేశ్వరీ! నీ వదనారవింద సందర్శనం వల్ల ప్రభవించిన ప్రేమవల్ల చలించని యీ నయన యుగళం కల నీ యీ సభను ఉన్మన్యావస్థను పొందిన దానినిగా భావిస్తూన్నాను.

112. జననీ! నా నయనాలు యీవిశ్వంలో దేనినీ చూడకుండును గాక! శ్రవణేంద్రియం దేనినీ ఆలకించ కుండును గాక! త్వగింద్రయం దేనినీ స్పృశించ కుండును గాక! రసనేంద్రియం అన్యరుచుల నెరుగ కుండును గాక! నిత్యానందం వల్ల తిరుగుతూన్న నయనాలు గల నీ స్వరూపామృతంలో నా మానసం నిత్యం మునుగుచుండును గాక!.

113. అమ్మా! తేజస్వరూపిణీ! పార్వతీ దేవీ! నిత్యం నిన్ను ధ్యానం ద్వారా ఎవడో ఒక్కడు మాత్రం దర్శించగలుగుతూన్నాడు. అంతరార్చనా విధాన మంతా శ్రుతి ప్రతిష్ఠితమైనదానినిగా భావిస్తున్నాను. ఓ త్రిపురసుందరీ దేవీ! అట్టి నీ అర్చనావిధాన సమయంలో ఆనందఘనాభిప్రాయం కల వానితో నే నేకీభవిస్తున్నాను. ఇదంతా నీ దివ్యాను గ్రహం వల్లనే లభించింది.

114. నాల్గు విదిశలయందు కల గణపతి, వటుక భైరవ, యోగినులను, క్షేత్రపాలకులు నీసర్వోపచారాలతో అర్చించి సంప్రదాయోక్తాలైన యుక్తులతో బలిని సమర్పిస్తూన్నాను.

115. నీకు దగ్గరగా కూర్చుని వీణవాయిస్తూన్న పరిచారికకు శేషపదార్థాన్ని నివేదించి బంగరు కూజా నుండి వచ్చే జలాలతో శుద్ధాచమనం చెయ్యి తల్లీ!.

116. సుగంధాలు వెదజల్లే పచ్చకర్పూర, కస్తూరి, జాజికాయ,

జాపత్రి, వక్కలు, లవంగాలు పొడి చేసిన మాత్రలతో కూడిన తాంబూలాన్ని భక్తితో నీకు సమర్పిస్తూన్నాను. బంగరు పళ్ళెరంలో ఉన్న అన్నచూర్ణ రచిత దీపాలచే ప్రజ్వరిల్లు రత్నాంకుర స్ఫురణను కలుగ జేయు నట్టి మంగళ హారతిని స్వీకరించవమ్మా!

117. అవ్యక్తమధురనాదాలు ఉల్లసిల్లే టట్లు ఓ కిన్నరాంగన గానం చేస్తూన్నది. వాద్యవిశేషాన్ని ధరించి ఊర్వశి వాయిస్తూండగా నీ సమక్షంలో విలాసంగా రంభ మృదు పాదన్యాసంతో నాట్యం చేస్తూన్నది. ఇతరేతర కృత్యాలను విడనాడి అమరకాంతలు - మధుమదం వల్ల తిరుగుడు పడుతూన్న కన్నులు గల నిత్యురాలవు, ఆనందసాగర సదృశమైనదీ అయిన నీ వదన కమలాన్ని సందర్శిస్తూ ఆనందపరవశలై పోతూన్నారు.

118. సంగీతరసజ్ఞాతలైన కిన్నరాంగనలు మధురస సమంగా అతిమధురంగా మ్రోయించు వీణా ఝుంకార నాదాన్ని శ్రీ చక్రస్థిత శక్తి సంఘాలు తాంబూల చర్వణం కారణంగా విశేషంగా ప్రకాశించు ముఖారవిందాలతో భవదీయ నిర్మల వదన సందర్శన భాగ్యంగా యితోధిక వికసిత నయనాలు గలవారై యితరేతర విషయాసక్తిని విడనాడి ఆలకిస్తున్నారు. ఆ వీణా మధుర నాదాలను పరమశివ స్వరూపానందార్థం జననీ! ఆలకించవమ్మా!

119. అమ్మా! నిన్ను ఆరాధించే విధానంలో లవలేశ జ్ఞానం

కూడా నాకు లేదు. ఆ పూజలకు కావలసిన ద్రవ్య సంపదాదులూ నాకు దూరంగానే వున్నాయి. అంటే అసలే లేవు. అందువల్ల నీకు ప్రదక్షిణం చేసి పంచోపచార స్వరూపమైన - గంధ పుష్పధూప, దీప, నైవేద్య రూపమైన పూజను నీకు సమర్పిస్తున్నాను.

120. మనోగత ప్రకటితోపచారాల ద్వారా అర్చించ బడిన దానవై - నీ శ్రీ చక్రస్థిత ఆవరణ దేవతలతో కలిసి కామేశోత్సంగవాసినివై యున్న ఓ భగవతీ! అంజలి బద్ధుడనై - పదే పదే కర, చరణ, భుజ, వక్షఃస్థల లలాటాలు భూమికి తగులు నట్లు: అని నీకు ప్రణమిల్లుతున్నాను.

121. మాతా! సావధానంగా నా విన్నపాలను ఆలకించు. స్వేచ్ఛగా సంచరించునట్టి కాందిశీకునిలా - విశేషప్రయత్నం చేసి చిట్ట చివరకు నీ దివ్య సన్నిధిని చేరిన నన్ను ఓ తల్లీ! ఇప్పుడు దూరగతుని చెయ్యకు. నీ చరణ ధ్యానంలో నా మనోవాక్ దృష్ట్యాదులు పరిభ్రమించిపోవు వేళ శీఘ్రంగా నువ్వు స్వగుణ బంధనాలతో పునః పునః ఆదిలో వలె పోకుండే టట్లు బంధించు తల్లీ!

122. మందమతినైన నేనెక్కడ? ఏకాంత భక్త బృందాలతో జరుగునట్టి నీ స్తోత్ర, ధ్యానాదు లెక్కడ? అయినా ఓ దేవీ! మనసా నేను భవదీయ పాదపూజ చేసినాను.

ఒకప్పుడు నా ధ్యానవిధానానికి ప్రసన్నురాలైన ఆ దేవియే సుఖప్రదమైన యీ స్తోత్రాన్ని నా వదనం నుండి బహిర్గతం చేసినదని భావిస్తాను.

123. సదా నా మదిలో భావింపబడినట్టి నీ నిత్యార్చనం వివిధ విధపద్యాలతో స్తోత్రంగా రచించబడినది. అమ్మా! త్రిపుర సుందరీ దేవీ! నన్ను అనుగ్రహించెదవు గాక!.

ఇది శ్రీ శంకర భగవత్పాదాచార్య
విరచితమైన శ్రీ త్రిపుర సుందరీ
మానసపూజాస్తోత్రం సంపూర్ణము.

ఓం ఐం హ్రీం శ్రీం
త్రిపుర సుందర్యై
నమః

# శ్యామలాదండకానికి భావార్థము

మణిమయమైన వీణను ధరించి శ్యామలాదేవి వాటి తంత్రులను మేళవిస్తూన్నది. మదాలసయైన ఆ తల్లి మనోహర వాగ్విలాసంతో భాసిల్లుతూన్నది. ఇంద్రనీలమణి ప్రభలతో తేజరిల్లే ఆ జననిని ఆ మాతంగ కన్యను మనసా స్మరిస్తూన్నాను. (1) చతుర్భుజాలతో శిరోపరిభాగం పై చంద్రరేఖను ధరించి, ఉన్నత స్తన ద్వయంతో, కుంకుమ సమ అరుణారుణ ఛ్ఛాయతో పాశాంకుశ ఇక్షుదండ పుష్పబాణాలను ధరించి తేజరిల్లే జగజ్జననీ! నీకు ప్రణామాలు. (2) మరకత మణిమయ ప్రభలతో మధుపాత్రను ధరించి కదంబోద్యాన వనంలో విహరిస్తూ తేజరిల్లే సర్వమంగళ రూపిణి అయిన మాతంగ నందిని మమ్మల్ని కరుణారస దృష్టులతో వీక్షించును గాక! (3) అమ్మా! మాతంగనందినీ! నీకు జయమగును గాక! నీలోత్పల సమఛ్ఛాయ గల ఓ మాతా! నీకు జయమగును గాక! సంగీత రసికురాలా! నీకు జయమగును గాక! లీలగా శుకాన్ని పట్టుకొనుటకు యిష్టపడునట్టి మాతా! నీకు జయమగును గాక! కల్పతరువులతో కూడిన ఉద్యానవనంలో వసించడానికి యిష్టపడే తల్లీ! సర్వ జగత్తులకు ప్రీతిపాత్రమైన ఆ జనని సంగీత సాధనకు సన్నద్ధురాలైన వేళలో ఆమె గళ సీమలోని కదంబహారం కదులుతూ ఉంటుంది. పర్వతరాజనందిని అయిన ఆ తల్లి శిరోభూషణంగా ధరించిన చంద్రరేఖ ప్రభల ప్రసారంతో

సుందరంగా గోచరించే ముంగురులతో ఆమె శోభిల్లుతూన్నది. సమస్త జగత్తులూ ఆ మాతను సంభావిస్తూన్నాయి. మదనుని ధనుస్సును బోలిన భృకుటి కలదియైన ఆ జనని దేహానికి పూసుకున్న గోరోచనం ఆ భ్రూలత నుండి ప్రభవించిన సుమములా? అన్న శంక కలుగుతూన్నది. నారీ శిరోమణీ, మహాలక్ష్మీ స్వరూపిణీ అయిన ఆ జనని శిరోపరిభాగంపై పాపిడి పిందెలు కలిగి, చంద్రరేఖను ధరించి ఉంది. లావణ్యంతో ఆ జనని శరీరం భాసిల్లుతూన్నది. కపోల భాగంలో కస్తూరితో రచించబడిన పత్రరేఖలు సుందరంగా గోచరిస్తూన్నాయి. వాటి నుండి సుగంధం బహిర్గత మవుతూన్నది. వాటికి ఆకర్షితమైన భ్రమరాలు ఝుంఝుం నాదాలు చేస్తూ గీతాలాపన చేస్తూన్నాయి. తత్స్వరంతో కలిసి ఆమె వీణా నాదం ద్విగుణీకృత మంద్రస్థాయిని అందుతూన్నది. సుస్వరంతో ఆ తల్లి భాసిల్లుతూన్నది. వీణానాదం చేస్తున్న ఆమె కర్ణాభరణాలు నయనానంద ప్రదంగా కదలాడు తూన్నాయి. ఆమెను సిద్ధులందరూ సేవిస్తూన్నారు. దివ్య మద్యపాన మదంతో ఆమె సవిలాసయై నయన సౌందర్య సౌభాగ్యం కలిగి కర్ణాభరణంగా ధరించిన నీలోత్పలంతో శోభిల్లుతూన్నది. తనను ఆశ్రయించిన వారి అభీష్టాలను సిద్ధింప చేసగా వారికి నిజ సేవా ఫలంగా సంపతలను ప్రసాదిస్తూంటుంది. ఫాల భాగాన ఏర్పడిన స్వేద బిందువులు పొటమరించగా అందలి ఓ బిందువు క్రిందకు జారి పడగా ఉన్నదా! అన్నట్లు బిందువే సందేహాన్ని కలిగిస్తూ ముత్యపు టడ్డ బాసను ధరించి ఉంది. సర్వమంత్ర స్వరూపిణియైన ఆమె కాళీరూపిణి, కుంద పుష్పసమ ధవళ కాంతులతో తేజరిల్లు మందస్మిత వదనారవిందంతో కర్పూర

తాంబూలాన్ని సేవిస్తూ ప్రకాశిస్తున్నది. జ్ఞానముద్రను ధరించి సిరులను ప్రసాదించునదీ, కుందపుష్ప సమ దంతపంక్తితో - మందస్మితంలో, అరుణాధరాలతో, ఆమె భాసిల్లు తూన్నది. సుందరమైన వీణను ధరించి దొండపండ్లను తలపింప జేయునట్టి పెదవులతో నవ యౌవ్వనారంభ వేళలో చంద్రోదయ సమయాన ఉప్పొంగే సాగరంలో ప్రభవించిన శంఖాన్ని తలపింపజేసే కంఠసీమ కలదీ, సత్కళలకు ఆకరంగా ఉంటూ, మందగమనం కలదై ఉంది. ఆ జనని శరీరమంతా నిండిపోయిన తేజరిల్లే ఆభరణాలను ధరించి ఉంది. మెరిసిపోయే రత్న కేయూరాలను బాహువులకు అలంకరించుకుంది. యోగీశ్వరులచేత ఆరాధింప బడే ఆ జనని కరకంకణ ఖచిత మాణిక్య ప్రభలు దిశాంతాల పర్యంతం వ్యాపించి ఉన్నాయి. సాధుజన సంసేవితయై ప్రభాత సమయ వికసిత పద్మ సమ హస్తాలు కలిగిన ఆ జననికి సాటి ఎవరున్నారు? ఆ జనని ధరించిన దివ్యరత్న ప్రభా ప్రసారం సంధ్యా సమయాన్ని తలపింపజేయ, హస్తాంగుళులు చిరుగుటాకులను, నఖాలు ఉదయించే చంద్రరేఖలనూ తలపింప జేస్తున్నవి. నారాయణునిచే సంస్తుతింపబడుతూ జ్ఞాన ప్రభలతో తేజరిల్లుతూ మిలమిల ప్రకాశించే కుండలాలను ధరించింది. ఆ తల్లి వక్షఃస్థలం మీద నక్షత్ర మాలను స్ఫురింప జేసే హారాలు భాసిల్లుతూన్నాయి. సాగర సమ సౌందర్య రాశీ అయిన ఆమె ఉదర స్థాన మందలి త్రివళి (ముడతలు) తరంగాలూ, విశాల వక్షఃస్థలమూ ఆమె భక్తజనులయిన సేవకులకు సంపదలను ప్రసాదిస్తాయి. హేమ కలశాలను స్ఫురింపజేసే కుచ భారంతో ఆ జనని యీషణ్మాత్రంగా అవనతమై ఉంది, వర్తులంగా ఉండే ఆమె నాభి సరస్సు

కాగా దాని తీరాన ఉన్న నాచును స్ఫురింపజేసే రోమావళితో ఆమె ప్రకాశిస్తున్నది. మనోహర సంభాషణలతో, మదనుని శరాసనానికి గల నారిని స్ఫురింపజేస్తున్న మొలనూలు మువ్వలతో సవ్వడి చేస్తున్నది. దివ్య సుందర రత్నాంబరాన్ని ధరించిన ఆ జనని పద్మరాగమణి ప్రభలను స్ఫురింపజేసే మొలనూలును ధరించి ఉండడం వల్ల ఆమె శ్రోణీస్థలం హేమమయ పృథ్వీమండలాన్ని స్ఫురింపజేస్తున్నది. ఆమె చంద్రికా సమ శీతలత్వాన్ని ప్రసరింపజేస్తూ విరబూసిన మోదుగ పూవువంటి ఛాయ గల దివ్యాంబరాన్ని ధరించి ఉంది, అపార వైభవంతో భాసిల్లు ఆమె శ్యామల వర్ణంతో గోచర మవుతూన్నది. ఓ హరిణిని దగ్గరగా తీసుకుని ఆ తల్లి తన చేతితో దానిని నిమురుతున్నది. ఆమె దేహ బహిర్గత శ్యామల కాంతులను దర్శించి ఆ హరిణి దానిని గరికలుగా భావించి ఆ తల్లి సన్నిధిగా చేరినదా? అని అనిపిస్తున్నది. పవిత్ర స్వరూపిణి అయిన ఆమెను దేవ , దేవేశ్వర, అసురేశ్వర, యక్షేశ్వర, శివ, బ్రహ్మ, నిర్ఋతి, వాయురగ్న్యాదులు - తమ తమ కిరీటస్థ రత్నాలు ఆ జనని పారాణి పాదాలను తాకేటట్లు వంగి నమస్కరిస్తున్నారు. యౌవ్వన లక్ష్మి ఆమెలో ఉట్టిపడుతూన్నది. నవరత్న ఖచిత మనోహర సింహాసనంపై ఆ జనని భాసిల్లుతున్నది. శంఖ, పద్మాలను ధరించి ఉంది. దుర్గ, క్షేత్రపాలకులు ఆ తల్లిని సేవిస్తున్నారు. మాతంగ కన్యలు, అష్టభైరవులు, వ సూది శక్తులూ ఆమెను పరివేష్టించి యున్నారు. అష్ట లక్ష్మ్యాది శక్తులు ఆమెను ఆరాధిస్తున్నారు. రతీమన్మధులు ఆ విశ్వ జననిని సేవిస్తున్నారు. అమ్మా! భక్తజనులకు నువ్వు

విశేష శ్రేయస్సును ప్రసాదిస్తావు. యోగులు నిన్ను ధ్యానిస్తుంటారు. ఛందస్సులతో నువ్వు భాసిల్లుతుంటావు. గీత విద్యా సంబంధంతో తుష్టిని పొందిన శ్రీ కృష్ణదేవుడు నిన్ను ఆరాధిస్తుంటాడు. యక్ష, గంధర్వ, సిద్ధాంగనాదులు నిన్ను ఆరాధిస్తుంటారు. సౌభాగ్యాన్ని కోరిన దేవాంగనలు అనేక మందిచే నువ్వు ఆరాధింప బడుతుంటావు. విశేష విద్యా జ్ఞానంతో చతురగాథా ప్రవచన శక్తితో, రేఖలతో భాసిల్లే కంఠదేశం కలిగి, కోమలాలై, శ్యామలాలైన వక్షాలు కలిగి మోదుగపువ్వు కంటె కూడ ఎర్రగా ఉండే నాసిక కలిగి ప్రకాశించే శుకాన్ని లాలిస్తూ వినోదిస్తుంటావు. కరద్వయంలో పుస్తక, అక్షమాలలను ధరించి జ్ఞాన సారమే యిది అనదగిన స్థాయిలో గోచరిస్తుంటావు.

ఇంతవరకూ వర్ణించిన భావాలతో ఏకాగ్రచిత్తులై నిన్ను ధ్యానించే వారి వదనం నుండి గద్య పద్యాత్మికాలైన కవిత్వాలు బహిర్గతాలవుతాయి. పతి సమేతవైన నిన్ను భావించువారు ఐశ్వర్యానీకంతో భాసిల్లుతారు. శ్యామలమై, కోమలమై, చంద్ర రేఖాయుతమైన నీ దివ్య స్వరూపాన్ని ధ్యానించునట్టి వార్కి అభీష్టాలన్నీ సిద్ధిస్తాయి. సాగరం వారికి లీలా సరోవర మవుతుంది. ...నవనం ఉద్యాన వనం అవుతుంది. భూతలం భద్రాసనం కాగా, లక్ష్మీ సరస్వతులు సేవికలై ఆజ్ఞాకారిణు లవుతారు. ఓ సర్వయంత్ర, సర్వమంత్ర, సర్వముద్రా స్వరూపిణీ! సర్వ శక్తి, సర్వ వర్ణ, సర్వ స్వరూపిణీ! జగన్మాతా! నన్ను రక్షించు, నన్ను రక్షించు, నన్ను రక్షించు, మాతా! నీకు ప్రణామము. ప్రణామము. ప్రణామము.

0 0

# సాదరాహ్వానము

విశ్వవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తిక సోదర సోదరీమణులలో భక్తి జ్ఞాన వైరాగ్య భావాలను వర్ధిల్ల జేసే సంకల్పంతో సుమారు 18 లక్షల రూపాయల వ్యయంతో విడుదల కావలసియున్న

# శ్రీ కృష్ణలీలామృతము

అన్న గ్రంధ రత్న ప్రచురణ విశేష ప్రచారోద్యమము నిర్విఘ్నంగా మంగళ ప్రదంగా కొనసాగుటకు గాను

# భాగవత మాహాత్మ్యము

అన్న ప్రత్యేక సంచిక యొక్క 10 వేల ప్రతుల ప్రచురణ ప్రచారాలకు పూనుకున్నాము. ఇందు నిమిత్తం రు. 1000/- వంతున అందజేయగల సభ్యులను సాదరంగా రెండు వేల మందిని ఆహ్వానిస్తున్నాము. విరాళాలను డి.డి. రూపంలో లేదా చెక్కు రూపంలో యీ చిరునామాకే అంద జేయండి.

వివరాలకు ఫోన్ : 76356 : STD·0883.

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

రాజమండ్రి - 4. ఆంధ్రప్రదేశ్ - (ఇండియా)

**శ్రీ త్రిపురసుందరీ మానసపూజాస్తోత్రమ్** **రూ 5-00**

ఆపదలను రూపుమాపి, సర్వసంపదలనూ ప్రసాదించునట్టి పాతాళ, భూతల, వ్యోమ మార్గాలలో ఏ దుష్ట శక్తి కనులెత్తి చూడ లేనట్టి, నరఘోష నివారకమైనట్టి, సాధకుని, శ్రద్ధ, భక్తి విశ్వాసాల స్థాయికి అనుకూలంగా సత్వర సత్ఫలితాలను ప్రసాదించునట్టి యంత్రరాజము. సైజ్: 6 x 6 అంగుళాల వైశాల్యము. యంత్రం దేవనాగరీ లిపిలో వుంటుంది. యంత్రం దర్శనమాత్రంచే సమస్త శుభ విజయ, మంగళ, పరంపరలూ చేకూరుతాయి. కావలసిన వారు తమ గోత్రనామాలపై రు 500-00లు అందజేయాలి. వి.పి. పద్ధతి లేదు. ద్రవ్యం అందిన తరువాత యంత్రాన్ని ప్రతిష్ఠించి 21 రోజులు పూజలో వుంచి రిజిష్టర్డ్ పార్సెల్ ద్వారా అందజేయ గలము. ద్రవ్యాన్ని ఏ బ్యాంక్ డి.డి. ద్వారా నైనా లేదా మనియార్డర్ ద్వారా నైనా అవకాశం వుంటే స్వయంగా అందజేయవచ్చును.

ఈ చిరునామాకే ద్రవ్యం పంపాలి.

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

జయశ్రీటాకీస్‌రోడ్ - సూర్యాహోటల్ దగ్గర

గోదావరీ స్టేషన్‌కు సమీపంలో రాజమండ్రి-4

ముద్రణ నిర్వహణ:

భరద్వాజా బైండింగ్ వర్క్స్ - రాజమండ్రి - 4